# హరి పాఠము







## జ్ఞానేశ్వర్ మహారాజ్

తెలుగు అనువాదము :

**గురుదాస్ మిట్టపల్లి శంకరయ్య**

## శ్రీ గురు శరణం మమః

**గురుపుశ్యాంమృత్**
స్వస్తిశ్రీ ధుర్ముఖి నామ సం॥ర మాఘ శు॥ త్రయోదశి
గురువారం తేది. 09-02-2017

**ప్రతులు:**
2000

**ప్రచురణ :**
జయ జయ రామకృష్ణహరి
భావిక బృందము

**ప్రతులకు :**
**బాలాజి సెలక్షన్స్**
పోస్టు : గ్రా॥ ఇచ్చోడ - 504307
జిల్లా : ఆదిలాబాద్.
తెలంగాణ, భారతదేశము
సెల్: 9985030335

**మూల్యం : 30/-**

ముద్రణ :
వెంకటరమణ ముద్రణాలయం
వరంగల్.
సెల్ : 9849235297



# SREEPEETAM

# 1-9-278/10/1, Lalitha Nagar,
Vidyanagar, Hyderabad - 5000 044.
Ph: 27076655, M: 98490 33991



హరిః ఓం

సంత్ జ్ఞానేశ్వర్ మహరాజ్ మహారాష్ట్రలో క్రీ.శ 1275-1296 కాలం నాటి వారు. ఆయన జీవితం బాల్యం నుంచే అనేక సంక్షోభాను చూసింది. పడరాని కష్టాలు పడింది. ఇవేవీ జ్ఞానేశ్వర్ భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను చెక్కు చెదర్చలేకపోయాయి.

జ్ఞాన, వైరాగ్యాలతో కూడిన భక్తి - జీవితానికి అపారమైన తేజస్సును జత చేస్తుంది. ఆ తేజస్సు జ్ఞానేశ్వర్ విషయంలో మరాఠీలోని ఓవి ఛందస్సులో మధురమైన హరి భక్తి గానంలో ప్రకాశించింది. 'అభంగాలు'గా పిలిచే ఆ పాటలలోని గొప్పదనానికి తార్కణం అవి ఈనాటికీ భక్తుల నాలుకలమీద నానుతుండడం. మరో ఉదాహరణ 'హరిపాఠం' పేరుతో మరాఠీలో ఉన్న జ్ఞానేశ్వర్ అభంగాలను తెలుగు చేయాలనే సంకల్పం 700కు పైగా ఏళ్ల తరువాత ఇప్పుడు క్రీ.శ 2016లో ఆదిలాబాద్‌లోని ఇచ్చోడ గ్రామానికి చెందిన 'గురుదాస్' శ్రీ మిట్టపల్లి శంకరయ్య అనే భక్తుడికి కలగడం.

సరళమైన, మధురమైన, నిరాడంబరమైన శైలిలో శ్రీ శంకరయ్య ఈ అభంగాలను రాశారు. 'నామ సంకీర్తన అతిమధురము, సాధనలందు ఇదే సులభము, జన్మాంతరాల పాపసమూహము, భస్మమై తీరును ఇదియే నిక్కము' అని తెలుగున పలకడంలో జ్ఞానేశ్వరుని హృదయం శ్రీ శంకరయ్య లేఖిని ద్వారా ఈనాటి భక్తహృదయాలకు పదిలంగా చేరుతోంది.

శ్రీహరి ఆశీస్సులు రచయితపైనా, పాఠకులపైనా మరింతగా వర్షించి, పోతనగారన్నట్లుగా కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాధు వర్ణించు జిహ్వజిహ్వ అనే సనాతన దివ్య సందేశం నవతరాలకు మరింత హృద్యంగా అందాలని శ్రీహరిని ప్రార్థిస్తూ...

ఓం నమో నారాయణాయ!

స్వామి పరిపూర్ణానంద

స్వామి పరిపూర్ణానంద



# ప్రస్థావన

## హరి! హరి!! పొగడంగవశమె!

**ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి**

మజ హృదయీా సద్గురు । జెణె తారిలో హ సంసార్పురు॥
మ్హణవుని విశెషె అత్యాదరు॥ వివేకావరీ ॥

**భావము:** నా హృదయములోని సద్గురు నన్ను ఈ సంసార సాగరము నుండి తరింప జేసినారు. అని నేను వివేకముతో విశేషముగ అత్యధికముగ ఆదరించెదను.

**నామసుధ:** నా హృదయమే సద్గురు నిలయము తరింప జేసినారు సంసారపురము
సత్సంగమున కలిగే వివేకము అందుకే విశేషముగా అత్యాదరము

సంత్ శిరోమణి జ్ఞానేశ్వర్ మహరాజ్ తెలుగులోని పదసంకీర్తన కవుల వలె మరాఠీ భాషలో పాడుకొన్న "హరిపాఠ్" గీతాలకు భావం వ్రాసి ఒక్కొక్క గీతాన్ని పాడాలని (అభంగ్ పదాన్ని) గురుదాస్ మిట్టపల్లి శంకరయ్య-నాగమణి గారు అనుకొన్నారు. అలా అనుకోవడానికి ఓ నేపథ్యముంది. వారు శ్రీమలయాళస్వామి వారి శిష్యులు, శ్రీ శుకబ్రహ్మాశ్రమ వ్యవస్థాపకులు శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి వారిని గురుదేవులుగా స్వీకరించారు. ఆగురుదేవుల బోధలు విన్నారు వారు రచించిన "గీతా మకరందాన్ని" కూలంకషంగా చదివారు ఒక విధంగా అర్థ భావ వ్యాఖ్యాన పూర్వకంగా పారాయణం చేశారు. ఆ ప్రభావం పడిన వారందరు ధరదీష్ పురుషులవుతారు.

శ్రీ స్వామి వారి వ్యాఖ్యానం ఆ విధంగా తీర్చి దిద్దుతుంది. శ్రీ శంకరయ్యగారికి తులసి మాలదారణ చేయించిన గురువులకు, మంత్రదీక్ష ఇచ్చిన గురువులకు నమస్కరించాలి. వీటన్నిటి ద్వారా ఆధ్యాత్మిక మార్గంలో నడిచి శ్రీ శంకరయ్య గారు దివ్యజ్ఞాన సంపన్నులయ్యారు. ఆ కారణంగానే జ్ఞానదేవుల హరిపాఠ్‌లోని 28 అభంగాలను తెలుగు హరిపాఠం పేరిట అనువదించారు. శబ్దశాస్త్రం, అర్థశాస్త్రం, శిల్పశాస్త్రం అధ్యాయనం చేసి, చేసిన అనువాదం కాదిది. ఇది కేవలం భక్తిశాస్త్రం అధ్యాయనం చేసి, చేసిన అనువాదం అంటే హృదయం నిండా భక్తి పరిమళించగా చేసిన అనువాదమన్నమాట.

1. అలనాడు వ్యాసులవారు హరినామం జపించుమన్నారు. అలాజపిస్తే హరి మనఇంట్లో ఉంటాడు. పాండవుల ఇంట్లో కృష్ణుడున్నట్లు... ఇది మొదటి అభంగం యొక్క అంతరార్థం.

క॥ హరియను రెండక్షరములు॥ హరియించును పాతకములంబుజనాభా॥
హరి నీ నామమహత్త్వము॥ హరిహరి పొగడంగ వశమే హరి శ్రీ కృష్ణా ॥

ఆహా! కృష్ణ శతకకారుడు ఎంత భక్తి నింపాడో ఈ శతకంలో చెప్పలేం! నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా! తెలుగు శతక కారుని ఈ మాటే జ్ఞాన దేవుని ఈ హరిపాఠం సారంశం. ఇలాగే ఆ 28 నామగీతాల్లోని సారం చూద్దాం !

2. ఎన్ని చదివినా, ఎన్ని నేర్చినా హరినామమంత సమానం కావు.
3. త్రిగుణాలలో సారం లేదు, సాకారుడు నిరాకారుడైన, నిర్గుణుడైన హరినామమే శ్రేష్ఠం.
4. భావన వల్లనే భక్తి, అభావన హరిభావనే కావాలి.
5. యాగం, తపస్సు, దానం కన్నా హరిభక్తుల సాంగత్యమే గొప్పది.
6. సాధుబోధవల్ల అజ్ఞానం పోతుంది, సజ్జనసాంగత్యం వల్ల అంతటా హరియే కనిపిస్తాడు.
7. ఆత్మయే దైవము, ఆత్మయే ఆ హరి, ఆయననే భజించు
8. సాంగత్యం, తత్వం, సాధన కన్నా హరి నామం సులభం
9. హరి పై విశ్వాసముంచు, లేకుంటే ఎవరి మీద నమ్మకముండదు, సగుణం నమ్మినా హరి నామ గానమే చెయ్.
10. నామానికి విముఖుడైనవాడే పాపి, హరినామం ఉద్ధరిస్తుంది.
11. అనంత పాపాలు హరినామ ఉచ్చారణతో మాయమవుతాయి.
12. తీర్థం, వ్రతం, నియమం అన్నీ సరేకాని హరినామమే ఉత్తమం.
13. ద్వైతబుద్ధివదలాలి, అంతా ఒకటిగా భావించి బుద్ధి, సిద్ధి పొందాలి.
14. రామకృష్ణుల నామజపం అనంతరాశుల తప ఫలం.
15. హరినామాలనేకమైనా అంతా ఒకటే, హరి నామ నియమం పాటించడమే ముక్తి.
16. హరినామం వల్లనే ఆత్మారాముని దివ్యదర్శనం అవుతుంది.
17. హరినామ గానం వల్ల దేహం పవిత్రం అవుతుంది.
18. మనస్సు తీసుకెళ్ళిన మార్గంలో కాకుండా స్థిరమైన బుద్ధితో హరినామం చేయాలి.
19. హరినామం అనే దివ్యశస్త్రం అందరితో ఉన్న మోహబంధాలను ఛేదిస్తుంది.
20. మాయ, మోహం అన్ని తొలగుతాయి. నామమే నాకు యజ్ఞం అంటున్నారు సంత్ జ్ఞానదేవుడు.
21. హరినామం వేదసారం, మన పూర్వీకులకు అదే వైకుంఠ మార్గం.
22. హరిని భజించని జన్మము వ్యర్థము, హరినామం వల్ల కలుగును దివ్యజ్ఞానం
23. మనోబుద్ధి, చిత్త, అహంకారాల వంటి ఇరవై అయిదు కూడా మిథ్యే, శ్రీహరి నామమొక్కటే తత్త్వము.
24. జాతి, విత్తం, గోత్రం, కులము, శీలము అన్ని వదిలివేసి ప్రతినిత్యం నేమముతో హరినామ గానం చేయాలి.
25. జ్ఞాని, అజ్ఞాని అనే భేదం భగవంతునికి లేదు, అందుకే శ్రీహరిచరణాలే శరణ్యంగా కదలాలి.
26. హరినామాన్ని మించిన సాధన మరొకటి లేదు, మౌన సాధనతో అంతరంగ నామ జపం చేయాలి.
27. ఇంద్రియాల బడి తిరగరాదు హరిసంబంధం శాంతి, దయ, ప్రేమ భావం.
28. కలియుగంలో అన్నింటికంటే నామసంకీర్తనయే అతిసులభం. నామంలోని మహిమ అపారం, నిత్యం నామ గానం చేయాలని తుకారాముడు చెప్పారు, నేను చెబుతున్నాను.

శ్రీ మిట్టపల్లి శంకరయ్య గారి 28 హరిపాఠ్ మరాఠీ అభంగాల నామసుధల సారం ఇది. కలియుగంలో నామం పవిత్రులను చేస్తుంది. ఈ నామాన్ని శ్రవణం చేయాలి! సంకీర్తనం చేయాలి!! స్మరణం చేయాలి!!! శ్రీహరిపాద సేవనం చేయాలి. !!!

# అంకితము

మహాజనులారా ఒక్కమాట వినండి, ప్రతి రోజు హరిపాఠము చదవండి. జన్మ తరించి పోగలదు. ఇది వేదశాస్త్రాల ప్రమాణము, మహర్షి వేదవ్యాసులు తెలిపిన మాట పుణ్యదంపతులు నా తల్లిదండ్రులు మిట్టపల్లి రాజవ్వ రాజయ్యగారలు మరియు గీతామకరందము ప్రతి నిత్యము చదవమని సంకల్పము చేయించిన గురుదేవులు బ్రహ్మలీన శ్రీశ్రీశ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వామీజీ శుక బ్రహ్మ ఆశ్రమము శ్రీకాళహస్తి గారలు, తులసీమాల ధారణ చేయించిన బ్రహ్మలీన సోపాన్‌కాకా గారు, నాకు మంత్ర ధీక్ష ఇచ్చిన గురుదేవులు బ్రహ్మనిష్ట విఠ్ఠల్ మహారాజ్ సాండోళ్‌కర్ గారలు, నాకు శాస్త్ర జ్ఞానం తెలిపిన నిరాపేక్ష భక్తులు

శ్రీ నారాయణ్ మహారాజ్ వైష్ణవ సదన్ మాధాపూర్ గారలు. వీరు తెలిపినటువంటి బోధనలు ఆలకించి నేను శ్రీశ్రీశ్రీ సంత్ శిరోమణి జ్ఞానేశ్వర్ మహారాజ్ మరాఠీ భాషలో రచించిన హరి పాఠము యను పుస్తకమును తెలుగు భాషలోనికి అనువాదము చేసినాను. ఈ హరి పాఠమును సంపూర్ణముగా అనువాదము చేయాలంటే మళ్లీ ఒక్కసారి జ్ఞానేశ్వర్ మహారాజే అవతరించవలసి ఉంటుంది. గురుకృపతో యదామతి నా బుద్ధికి అందినంత ప్రయత్నం చేసి జనతారూపములో కనిపించే జనార్ధనుడికి అంకితము చేయుచున్నాను.

తామెల్లరును ప్రేమ పూర్వకముగ స్వీకరించి దీవించ ప్రార్థన.

ఈ హరిపాఠమును చదివి మీయొక్క అభిప్రాయములను తెలియపరచ గలరని మనవి.

భవదీయ

అనువాదకుడు: **గురుదాస్ మిట్టపల్లి శంకరయ్య నాగమణి**

**బాలాజీ సెలక్షన్స్ బట్టల దుకాణము**

పోస్ట్/మం. ఇచ్చోడ, జిల్లా ఆదిలాబాద్ – 504 307

ఫోన్ నం. 9985030335

***E-mail : mittapallyshankaraiah.rss@gmail.com***

***https://www.facebook.com/shankaraiah.mittapalli.9***

# జయజయ రామ కృష్ణహరి...!

అభంగ్ ॥ సుందర తే ధ్యాన ఉబె విఠేవరీ – కర కటావరి ఠెవునియా..
తులసిహర గళా కాంసె పీతాంబర – ఆవడె నిరంతర హెచి ధ్యాన..
మకర కుండలే తళపతి శ్రవణీ – కంఠి కౌస్తుభ మణి విరాజీత..
తుకా మ్హణే మాఝే హెచి సర్వసుఖ – పాహీన శ్రీముఖ ఆవడీనె..

భావము॥

ఇటుకపై నిలబడి నడుముకు చేతులు పెట్టిన పాండురంగని విగ్రహము ధ్యానము చేయువారికి సుందరమై ఓప్పుచున్నది. మెడలో తులసిహారము పట్టుపీతాంబరము ధరించిన రూపము నచ్చి నిరంతరము నాకు ధ్యానానికి వచ్చుచున్నది. కంఠమందు కౌస్తుభ మణిహారము శోభిల్లుతు, చెవులకున్న మకర కుండలాలు నామ స్మరణము చేయవలెనని తలపింపచేస్తున్నాయి. ప్రేమ నిండిన హృదయముతో నీ శ్రీముఖమును చూచుచుండటయే నా సర్వసుఖమని తుకారాం మహారాజ్ అన్నాడు.

నామసుధ ॥

సుందరమైన ధ్యానము – ఇటుకపై నిలిచిన రూపము
నడుమున చేతులు అపురూపము – భక్తుల పాలిటి కల్పవృక్షము
మెడలో తులసి హారము – శోభిల్లు పట్టు పీతాంబరము
ధ్యానమునకు నిరంతరము – ఇష్టమైన ఈ దైవము.
చెవుల మకర కుండలము – తలపించె నామ శ్రవణము
కంఠమున కౌస్తుభ మణిహారము – విరాజిల్లు విగ్రహము
తుకారాముని మాట వినుము – ఇదియే నా సర్వసుఖము
చూచుచుండెద శ్రీముఖము – సంతసింపజేయుగ నయనము



# హరి పాఠము

## జయజయ రామ కృష్ణ హరి



### అభంగ్ - 1

దేవాచియే ద్వారీ ఉభా క్షణభరీ !
తేణే ముక్తి చారీ సాధియేల్యా!!

హరిముఖే మ్హణా హరి ముఖే మ్హణా !
పుణ్యాచీ గణనా కోణ్ కరీ!!

అసోని సంసారీ జివ్హేవేగు కరీ!
వేదశాస్త్ర ఉభారీ బాహ్యా సదా!!

జ్ఞానదేవ మ్హణే వ్యాసాచియే ఖుణే!
ద్వారకేచే రాణే పాండవా ఘరీ!!

### భావము :

దేవుని ద్వారమున క్షణ కాలము నిలబడిన వారికి నాలుగు విధములైన ముక్తులు సాధ్యము కాగలవు. హరి అని నోటితో పలుకుము. హరి హరి అని పలికిన వారికి లభించిన పుణ్యము లెక్కించుట ఎవ్వరి తరము కాదు. సంసారములోనే ఉండి హరి ప్రాప్తికై మనసును త్వర పర్చవలెనని వేద శాస్త్రాలన్ని సదా చేతులెత్తి ఘోషిస్తున్నాయి. ఇది వ్యాసుడు తెలిపిన గుర్తు (మర్మము). కావున ద్వారకకు రాజు అయిన శ్రీ కృష్ణుడు పాండవుల ఇంటిలో ఉండిరని జ్ఞానదేవులు తెలుపుచున్నారు.




# నామ సుధ -1

దేవుని ద్వారము శాంతికి నిలయము
నిలచిన అక్కడ ఒక క్షణ కాలము
నాలుగు ముక్తులు వారికి సాధ్యము
హరి నామములో మహిమ అనంతము

హరియని నోటితో గానము చేయుము
హరిహరియని నోటితో గానము చేయుము
అగణిత పుణ్యము అయ్యేను ప్రాప్తము
లెక్కించడము ఎవ్వరితరము

సంసారములో సాగు చుండుము
హరి ప్రాప్తికై వేగిరపడుము
వేద శాస్త్రముల ఘోషను వినుము
నిలబడిచేతులెత్తినవి కనుగొనుము

జ్ఞాన దేవుని వచనము వినుము
వ్యాసుడు తెలిపిన మర్మము కనుము
ద్వారక రాజు వచ్చిరి చూడుము
పాండవులింటిలో ఉండిరి స్థిరము.






# హరి పాఠము



## అభంగ్ - 2

చహూ వేదీ జాణ్ సాహి శాస్త్రీ కారణ్!
అఠరాహి పురాణే హరిసీ గాతీ!!

మంథునీ నవనీతా తైసేఘే అనంతా!
వాయా వ్యర్థ్ కథా సాండీ మార్గు!!

ఏక్‌హరీ ఆత్మా జీవశివసమా!
వాయా తూ దుర్గమా న ఘాలీ మన్!!

జ్ఞానదేవా పాఠ్ హరి హో వైకుంఠ్!
భరలా ఘనదాట్ హరి దిసే!!

**భావము :**

నాలుగు వేదముల జ్ఞానము ఆరు శాస్త్రాలకు కారణము పద్దెనిమిది పురాణాలు హరికి సంబంధించిన సారమునే గానము చేయుచున్నవి.

మంథనము చేసి నవనీతము తీసినట్టు అనంతుడిని తీసి పట్టవలెను. అవసరానికి రాని వ్యర్థ కథలను, మార్గములను వదిలి పెట్టవలెను.

ఒక్క హరియే ఆత్మగా జీవశివులలో సమముగా ఉన్నాడు. కావున అవసరములేని కథలు, సాధ్యము కానటువంటి సాధనలలో మనసు పెట్టకు.

నేను నిరంతరముగా హరిపాఠము పఠించుట వలన నాకు అంతటను హరి దట్టముగా కనిపించినాడు. కావున హరిపాఠము వైకుంఠమనిపించినదని జ్ఞానదేవుడన్నాడు.




## నామ సుధ -2

నాలుగు వేదాల సంపూర్ణ జ్ఞానము
ఆరు శాస్త్రాల మూల కారణము
పద్దెనిమిది పురాణాల నామ గానము
హరి నామానికి చెందిన సారము

మంథన చేసి నవనీతము తీయుము
చింతన చేసి అనంతున్ని పొందుము
నామము లేని కథలు వ్యర్థము
అన్య మార్గములు వదిలిపెట్టుము

హరి ఒక్కడే ఆత్మ స్వరూపము
జీవ శివులలో హరి సమానము
కఠిన సాధనను వదిలి పెట్టుము
నామములోనే మనసు నిలుపుము

జ్ఞాన దేవుడు పఠించే నామము
హరి నామము వైకుంఠ ధామము
నిండియున్నాడు హరి దట్టము
కనిపించినదంతట హరి రూపము






# హరి పాఠము



## అభంగ్ - 3

త్రిగుణ అసార్ నిర్గుణ హే సార్!
సారాసార్ విచార్ హరి పాఠ్!!

సగుణ నిర్గుణ గుణాచే అగుణ్!
హరి వీణ మన్ వ్యర్థ్ జాయ్!!

అవ్యక్త్ నిరాకార్ నాహీ జ్యా ఆకార్!
జేథోని చరాచర హరిసీ భజే!!

జ్ఞానదేవా ధ్యానీ రామకృష్ణ మనీ !
అనంత్ జన్మోనీ పుణ్య హెూయ్!!

**భావము :**

త్రిగుణము అసారము, నిర్గుణము సారము. సారమేది? ఏది అసారము? అనే విచారము చేసి తెలుపగలదు హరి పాఠము.

సగుణము,నిర్గుణము గుణములతో కూడియున్నదే అగుణము. హరితో మనసుకు సంబంధము లేకపోతే జీవితమంతా వ్యర్థమే.

అవ్యక్తుడు నిరాకారుడు, ఆకారము లేనివాడు ఎవ్వరి నుండి ఈ చరాచర సృష్టి జరిగినదో అట్టి హరినే భజించుము.

అనంత జన్మల పుణ్యము వలన నిరంతరము రామ కృష్ణుల రూపమునే ధ్యానము చేయుచు మనసు నిలిపి వారి నామమునే జపించే భాగ్యము కలిగినాదని జ్ఞాన దేవుడు అన్నాడు.




## నామ సుధ –3

త్రిగుణాలలో లేదు సారము
నిర్గుణములో కలదు సారము
సారమేది? ఏది అసారము
చేయు విచారము హరిపాఠము

సగుణము మరియు నిర్గుణము
మారుచున్న గుణములదే అగుణము
మనసు హరితో సంబంధము
వీడినచో అంతా వ్యర్థము

అవ్యక్తము నిరాకారము
లేదు అతనికి ఆకారము
ఎవ్వరి నుండి ఈ చరాచరము
అట్టి హరినే భజియించుము

జ్ఞాన దేవుని ధ్యానము
రామ కృష్ణులలో లీనము
అనంత జన్మల పుణ్యము
హరినామములో మనసు స్థిరము






# హరి పాఠము



## అభంగ్ - 4

భావే వీణ భక్తి భక్తి వీణ ముక్తి!
బళే వీణ శక్తి బోలూ నయే!!

కైసేని దైవత్ ప్రసన్న త్వరీత్!
ఉగా రాహ్వే నివాంత్ శిణసీ వాయా!!

సాయాస్ కరీసీ ప్రపంచ్ దిన నిశీ!
హరిసీ న భజసీ కోణ్యా గుణే!!

జ్ఞానదేవ మ్హణే హరిజప కరణే!
తుటేల్ ధరణే ప్రపంచాచే!!

**భావము :**

భావన లేక భక్తి, భక్తి లేక ముక్తి, బలములేకున్న శక్తివంతుడను అని చెప్పకూడదు.

ఏ విధముగా నీకు దైవం త్వరగ ప్రసన్నం కాగలదనుకొను చున్నావు? ఊరుకో ప్రశాంతంగా ఉండు లేనిచో అలసిపోతావు.

ప్రపంచము కోసం రాత్రి పగలు వృధా ప్రయాసము చేయు చున్నావు. ఏ గుణము ఆధారముగా హరి భజన చేయుట లేదు? (బలమా? ధనమా?).

హరి జపము చేయుట వలన భవబంధాలు తొలగి మాయ ప్రపంచపు పట్టు తెగిపోవునని జ్ఞాన దేవులు తెలిపినారు.




## నామ సుధ -4

భావన లేక భక్తులము కాలేము
భక్తి లేక ముక్తులము కాము
బలము లేక శక్తివంతులము కాము
చేయకూడదు అధిక ప్రసంగము

ఏ విధముగా దైవ ప్రసన్నము
త్వరిత గతిన అదియు సాధ్యము
అల్లరి చేయక ఊరకుండుము
అనవసరముగ అలసి పోకుము

రాత్రి పగలు ప్రపంచము కోసము
చేస్తున్నావు వృధా ప్రయాసము
ఏ గుణము అది నీకాధారము
హరిని భజించవు ఏమి కారణము?

జ్ఞాన దేవుడి మాటలు వినుము
హరినామమునే జపము చేయుము
పట్టు వదులును ఈ ప్రపంచము
తెగి పోగలదు భవబంధనము






# హరి పాఠము



## అభంగ్ - 5

యోగ యాగ విధీ యేణే నవ్హే సిద్ధీ!
వాయాచి ఉపాదీ దంభ్ ధర్మ్!!
        భావే వీణ దేవ నకళె నిస్సందేహ్!
        గురు విణ్ అనుభవ కైసా కళే?!!
తపే విణ్ దైవత్ దిధల్యా వీణ్ ప్రాప్త్!
గుజే వీణ్ హిత్ కోణ్ సాంగే!!
        జ్ఞానదేవ సాంగే దృష్టాంతాచీ మాత్!
        సాధూచె సంగతీ తరణోపాయ్!!

**భావము :**

యోగము, యాగము విధి విధానాలతో పరమార్థము సిద్ధించదు. ఇవి నశించే ఉపాదులు మరియు ధంభధర్మము కలిగించును.

భావన లేకపోతే నిస్సందేహముగ దేవుడు తెలియడు. గురువు లేకుండానే అనుభవము ఎలా రాగలదు.

తపము చేయక పోతే దైవత్వము రాదు. దానము చేయకుండానే పుణ్యము రాదు. మరి! అడగక ముందే హిత వచనము ఎవ్వరు చెప్పగలరు!

సాధు సాంగత్యమే తరుణోపాయమని శాస్త్రాదులలో అనేక దృష్ఠాంతములు కలవని జ్ఞానదేవులు చెప్పుచున్నారు.




## నామ సుధ -5

యోగ యాగము విధి యుక్తము
సిద్ధించదు వీటితో పరమార్థము
నశించే ఉపాధులే ప్రాప్తము
ఢంభధర్మము, అభిమానము

భావన లేనిదే దైవము
తెలియజాలదు నిస్సందేహము
గురువు లేనిదే ఆ అనుభవము
కలుగుట నీకు ఎలా సాధ్యము?

తపము చేయకనే దైవ కటాక్షము
దానము చేయకనే పుణ్య ఫలితము
అడుగక ముందే హిత వాక్యము
చెప్పేది ఎవ్వరు ఉపదేశము

జ్ఞాన దేవులు చెప్పిన వచనము
దృష్టాంతములున్నవి అనేకము
సాధువుతో చేయుము సాంగత్యము
వారి బోధలే తరుణోపాయము






# హరి పాఠము



## అభంగ్ - 6

సాధుబోధ్ ఝూలా తో నురోనియా ఠేలా!
ఠాయిాచ్ మురాలా అనుభవ్!!

కాపురాచీ వాతీ ఉజళలీ జ్యోతీ!
ఠాయిాచ్ సమాప్తీ ఝూలీ జైశీ!!

మోక్షరేఖే ఆలా భాగ్యే వినటలా!
సాధూచా అంకిలా హరిభక్త్!

జ్ఞానదేవా గోడీ సంగతీ సజ్జని
హరి దిసే జనీ వనీ ఆత్మతత్త్వీ॥

**భావము :**

సాధు బోధ అయిన క్షణమే సంశయము తొలిగి పోవును వెంటనే అజ్ఞానము నశించి పోయి ఆత్మానుభవము కలుగును.

నిప్పుతో కలిసిన కర్పూరము జ్యోతిగా ప్రజ్వలించి వెంటనే ఆరి పోయినట్లుగానే అజ్ఞానము నశించి పోవును.

సాధువుకే అంకితమైన హరి భక్తుడికి మోక్ష రేఖ దరిచేరి భాగ్యము ఉదయించును.

సాధువుల సాంగత్యమే మధురముగ ఉన్నదని తెలియుట వలన నాకు జనములో వనములో హరి కనిపించినాడని జ్ఞానదేవుని వచనము.




## నామ సుధ -6

సాధు బోధ అయినచో ప్రాప్తము
మిగలదు ఏమీ సందేహము
అజ్ఞానము అక్కడే మాయము
కలుగును వారికి ఆత్మ జ్ఞానము

నిప్పును కలిసిన కర్పూరము
దీప్తినిచ్చు ఉజ్వల ప్రకాశము
కర్పూరము అక్కడే సమాప్తము
ఆ విధముగా తొలుగును సందేహము

మోక్ష రేఖ చేరును సమీపము
ఉదయించు వెంటనే భాగ్యము
'సాధువుకే అంకితము జీవితము'
హరి భక్తిలో తానయ్యేను లీనము

జ్ఞాన దేవునికి అత్యంత ప్రియము
సజ్జనాళితోడి సాంగత్యము
జనములో వనములో హరిరూపము
కనిపించెను అంతట ఆత్మతత్త్వము






# హరి పాఠము



## అభంగ్ - 7

పర్వతా ప్రమాణే పాతక్ కరణే!
వజ్రలేప్ హెూణే అభక్తాసీ!!

నాహి జ్యాసీ భక్తి తో పతిత్ అభక్త్!
హరిసీ న భజత్ దైవహత్!!

అనంత వాచాళ్ బరళతీ బరళ్!
త్యాకైసేని గోపాళ్ పావే హరి?!!

జ్ఞానదేవా ప్రమాణ్ ఆత్మా హా నిధాన్!
సర్వా ఘటీ పూర్ణ్ ఏక్ నాందే!!

**భావము :**

పర్వతమంతటి పాపము చేసినవాడు అభక్తుడు. వాడు చేసిన కఠిన పాపాలు వజ్ర లేపమై బాధించును.

హరి భక్తి లేని వాడు పతితుడు, భక్తి హీనుడు హరి భజన చేసే భాగ్యము కోల్పోవును.

ఈ అధిక ప్రసంగిని, వాగుడుకాయను దయాళుడైన శ్రీహరి ఎందుకు కరుణించాలి?

ఆత్మయే తరగని దైవనిధి. సర్వ ఘటములలో హరి ఒక్కడే క్రీడించుచున్నాడని జ్ఞాన దేవులు తన అనుభవమును తెలిపినారు.




# నామ సుధ -7

పర్వత మంతటి పాపకృత్యము
అభక్తుడు చేసిన కర్మ సమూహము
అయి పోయినది వజ్ర లేపనము
భక్తిలేని బ్రతుకుయే హీనము

హరిపై లేదు భక్తి భావము
భక్తి హీనుడి బ్రతుకు పతితము
తీరి పోయినది దైవ ధనము
కోల్పోయాడు భజన భాగ్యము

నేర్చినాడు వాగుడు అధికము
వాదించడముతో ఏమి ఫలితము
శ్రీహరి రూపము దయగల దైవము
అయినాఎందుకు కరుణించడము?

జ్ఞాన దేవుని ప్రమాణము వినుము
"ఆత్మయే దైవ ధనము"
సర్వ ఘటములలో సంపూర్ణము
క్రీడించు హరి ఒక్కడే సత్యము






# హరి పాఠము



## అభంగ్ - 8

సంతాంచే సంగతీ మనోమార్గ గతీ!
ఆకళావా శ్రీపతీ యేణే పంథే!!

రామకృష్ణ వాచా భావ హా జీవాచా!
ఆత్మా జో శివాచా రామజప్!!

ఏకతత్త్వ నామ్ సాధితీ సాధన్!
ద్వైతాచే బంధన్ నబాధిజే!!

నామామృత గోడీ వైష్ణవా లాధలీ!
యోగియా సాధలీ జీవనకళా!!

సత్వర ఉచ్చార్ ప్రహ్లాదీ బింబలా!
ఉద్ధవా లాధలా కృష్ణ దాతా!!

జ్ఞానదేవ మ్హణే నామ హే సులభ్!
సర్వత్ర దుర్లభ్ విరళా జాణే!!

**భావము :**

సంతుల సాంగత్యము చేసి మనసును వేగిరపర్చుము శ్రీపతిని పట్టుటకు ఈ నామ మార్గము చాలా సులభము.. భావముతో రామ కృష్ణ నామము నాలుకతో పఠించడము జీవుడి ధర్మము. శివుని ఆత్మ రాముడు, కావున శివుడు రామ నామ జపము చేయుచున్నాడు. నామము ఏక తత్వము, సాధనము ఇదే, సాధ్యము కూడ ఈ నామమే, ఇలా తెలుసుకున్న వారిని ద్వైతము బంధించి బాధించదు..

నామామృతములోని మాధుర్యాన్ని వైష్ణవులు పొందినారు. యోగులు జీవించే కళలు సాధించగల్గినారు.. ప్రహ్లాదుడికి హరినామము హృదయములో నాటు కొనుటచే సత్వరమే ఉచ్చరించగల్గినాడు. దాతయైన శ్రీకృష్ణుడు ఉద్ధవుడికి లభించినాడు.

నామము సులభ సాధనము. నామ జపము చేయువారు మాత్రము దుర్లభము. ఎక్కడనో ఒక్క భక్తుడున్నాడు. కనుగొనుమని జ్ఞానదేవులు అంటున్నారు.

## నామ సుధ -8

సంతులతో సాంగత్యము చేయుము
గతి తప్పిన మనసును అరికట్టుము
వేగిరపడి శ్రీపతిని పట్టుము
ఈ పంతము ఎన్నటికీ మానకుము

రామకృష్ణ నామమునే పాడుము
ఈ నామమే జీవుడి భావము
శివుని ఆత్మ రాముడని ఎరుగుము
అందుకే జపించు శివుడా నామము

ఒక్కటే తత్వము భక్తుడి భావము
సాధనతో సాధ్యము ఆ నామము
తొలగి పోయినది బంధము
ఇక నుండి బాధించదు ద్వైతము

మధురమైన నామామృతము
సులభముగ వైష్ణవులకు లభ్యము
కష్టించితే జీవన పర్యంతము
యోగులకు జీవనకళ సాధ్యము

స్మరించెను ప్రహ్లాదుడు సత్వరము
నాటుకున్నది దైవ భావము
ఉద్దవునికి అయినాడు లభ్యము
దాతయైన శ్రీకృష్ణుడు ప్రాప్తము

జ్ఞానదేవుడన్నాడు ఆ నామము
అన్నింటిలో  ఈ సాధన సులభము
సాధించే సాధకులు దుర్లభము
ఉన్నారు ఏ ఒక్కరో కనుగొనుము



# హరి పాఠము



## అభంగ్ - 9

విష్ణువీణ్ జప్ వ్యర్థ్ త్యాచే జ్ఞాన్!
రామకృష్ణీ మన్ నాహీ జ్యాచే!!

ఉపజోని కరంటా నేణే అద్వైత వాటా!
రామకృష్ణీ పైఠా కైసేని హెూయ్?!!

ద్వైతా చీ ఝూడణీ గురువీణ జ్ఞాన్!
తయా కైచే కీర్తన ఘడేల్ నామీ!!

జ్ఞానదేవ మ్హణే సగుణ హే ధ్యాన్!
నామపాఠ మౌన్ ప్రపంచాచే!!

**భజన**

॥ రామకృష్ణ హరే జయజయ రామకృష్ణ హరే ॥

**భావము :**

విష్ణువుతో సంబంధము లేని జపము మరియు జ్ఞానము వ్యర్థము. వీరికి రామ కృష్ణులందు మనస్సు లగ్నం కాదు. ఈ మౌఢ్యులు అద్వైత మార్గమున పయనించ జాలరు. కావున వీరికి ఏ విధముగ రామ కృష్ణుల కృప లభించగలదు.? గురుబోధకానిదే ద్వైతము తొలగదు, జ్ఞానము కలుగదు. మరి భగవంతున్ని కీర్తించే భాగ్యము ఎలా సాధ్యము కాగలదు? ప్రపంచ విషయాల ఆసక్తి వదిలి వేసి సగుణ రూపాలను ధ్యానము చేయుచు మౌనముగా నామ పఠన చేయవలెనని జ్ఞానదేవులు అన్నారు.




## నామ సుధ -9

విష్ణువును వీడి పోయిన జపము
వ్యర్థమగును వారి జ్ఞానము
రామకృష్ణులలో లేదు విశ్వాసము
మదిలో నిలవదు హరినామము

జన్మించి అయినది దుర్భాగ్యము
తెలుసుకోడు అద్వైత మార్గము
ఎరుగ జాలడు నామ తత్త్వము
రామకృష్ణ కృప ఎలా ప్రాప్తము?

ద్వైతము తొలగక పూర్వము
గురువు లేకనే జ్ఞానము
నామ కీర్తన చేసే భాగ్యము
ఎలా అవుతుంది సాధ్యము?

జ్ఞానదేవుని ప్రబోధము
సగుణ రూపమునే ధ్యానము
ప్రపంచ విషయంలో మౌనము
నామమునే పఠనము చేయుము






# హరి పాఠము



## అభంగ్ - 10

త్రివేణీ సంగమీ నానా తీర్థ భ్రమీ !
చిత్త్‌నాహీ నామీ తరి తే వ్యర్థ్!!

నామాసీ విన్ముఖ్ తో నర్ పాపియా!
హరివీణ ధావ్‌యా న పవే కోణీ!!

పురాణ ప్రసిద్ధ బోలిలే వాల్మీక్!
నామే తిన్హీలోక్ ఉద్ధరతీ!!

జ్ఞానదేవ మ్హణే నామ జపా హరీచే!
పరంపరా త్యాచే కుళ శుద్ధ్!!

**భావము :**

త్రివేణి సంగమములో స్నానము, నానా తీర్థాల భ్రమణము చేసినను చిత్తమందు శ్రీహరి భావము లేకపోతే అది వ్యర్థము.

నామ స్మరణ చేయడానికి విన్ముఖము అయిన వాడు పాపాత్ముడు. ఈ పాపాత్ములను కూడా పరుగున వచ్చి రక్షించుట శ్రీహరికి తప్ప ఎవరికి సాధ్యము కాదు.

పురాణ ప్రసిద్ధుడైన వాల్మికి చెప్పుచున్నారు, నామ జపము చేసేవారు ముల్లోకాలలో ఉద్ధరించగలరని.

నామ జపము చేయువారి పరంపర కులయుక్తముగ పరిశుద్ధమైనదని జ్ఞానదేవులు అంటున్నారు.




# నామ సుధ -10

త్రివేణి సంగమమున స్నానము
నానా తీర్థాల భ్రమణము
చిత్తములో శ్రీహరి భావము
లేనిచో ఈ ప్రయత్నము వ్యర్థము

నామానికి అయినచో విముఖము
ఆ నరుడు పాపి అని అనుకొనుము
పాపిని రక్షించుట సత్వరము
హరికి తప్ప ఇతరులకసాధ్యము

పురాణ ప్రసిద్ధ వచనము
చెప్పినారు వాల్మీకి పూర్వము
నామమే మూడు లోకాలకు తారకము
అయినారు హరిభక్తులు ఉద్ధారము

జ్ఞాన దేవులు చెప్పిన వచనము
జపించాలి అందరు హరినామము
పరంపర వారిది సర్వము
కుల యుక్తముగా పరిశుద్ధము






# హరి పాఠము



## అభంగ్ - 11

హరి ఉచ్చారణీ అనంత్ పాపరాశీ!
జాతీల లయాసీ క్షణ మాత్రే!!

తృణ అగ్నిమేళే సమరస ఝూలే!
తైసే నామే కేలే జపతా హరీ!!

హరి ఉచ్చారణ మంత్ర్ హో అగాధ్!
పళే భూతబాధా భేణే తేథే!!

జ్ఞానదేవ మ్హణే హరి మాఝూ సమర్థ్!
న కరవే అర్థ్ ఉపనిషదా!!

**భావము :**

హరినామము ఉచ్చరించినంతలోనే అనంత పాపరాశులు క్షణ మాత్ర కాలములో నశించి పోతాయి.

చిన్న నిప్పు రవ్వ పడినచోటంతా అగ్నిగ మారినట్లు, హరినామ జపము చేయువారు హరి రూపులై పోతారు.

అగాధమైన ఈ హరి నామోచ్చరణ చేయువారి భూత బాధలన్ని పారిపోతాయి. మరి భయమెందుకు?

నా హరి సమర్థుడు, ఉపనిషత్తులు కూడ నా హరి సామర్థ్యానికి అర్థము చెప్ప జాలవని జ్ఞానదేవులు అంటున్నారు.




# నామ సుధ -11

ఉచ్ఛరించునంతనే హరినామము
అనంత రాశుల పాపము
హరించి పోవును సర్వము
క్షణ మాత్ర కాలంలో అంతము

గడ్డి పోచంత అగ్ని వేయుము
చేయగలదు అది దాని రూపము
ఆ విధముగ చేయును హరినామము;
జపించిన వారలను హరి రూపము

హరినామ ఉచ్చారణము
అగాధమైనది ఈ మంత్రము
భూత బాధలన్నీ పలాయనము
భయమెక్కడిది ఇప్పుడు చెప్పుము

జ్ఞాన దేవుడు పలికిన వచనము
సమర్థుడు నా హరి వినుము
చెప్పజాలవు ఉపనిషత్తులు అర్థము
హరినామ మహిమ అమూల్యము






# హరి పాఠము



## అభంగ్ - 12

తీర్థ్ వ్రత్ నేమ్ భావే వీణ్ సిద్ధి!
వాయాచి ఉపాధి కరిసీ జనా!!

భావబళే ఆకళే యెర్హవీ నాకళే!
కరతళీ ఆవళే తైసా హరీ!!

పారియాచా రవా ఘేతా భూమీవరీ!
యత్న పరోపరీ సాధన్ తైసె!!

జ్ఞానదేవ మ్హణే నివృత్తి నిర్గుణ్!
దిధలే సంపూర్ణ్ మాఝే హాతీ!!

**భావము :**

తీర్థవ్రతాలు, నేమాలలో భావనలేక పోతే ఫలితాన్ని ఇవ్వవు. అయినా కాని జనులు వృధా ప్రయాస చేయుచునే ఉన్నారు.

భావ జాలము కలవారు అరచేతిలోని ఉసిరి కాయను పట్టినట్లుగ శ్రీహరిని పట్టివేయగలరు. ఊరకనే లభించడు.

భూమిపై పడిన పాదరసము తీయవలెనన్న ఎంత కష్టమో! ఇతర సాధనాలు అదే విధముగ కష్టము కాగలవు.

శ్రీ గురువు నివృత్తినాథులు నిర్గుణ దైవాన్ని సంపూర్ణముగ నా చేతికి ఇచ్చినారని జ్ఞానదేవులు అంటున్నారు.




# నామ సుధ -12

తీర్థ వ్రతము ఆచార నేమము
భావన లేనిది ఏమి ఫలితము
వ్యర్థ ఉపాదులు వృధా ప్రయాసము
చేస్తున్నావు ప్రతిష్ఠ కోసము

భావబలమున పట్టగలము
భావన లేనిది పట్టజాలము
భావము తోడనే శ్రీహరి లభ్యము
అర చేతిలో ఉసిరిక చందము

భూమిన పడిన పాదరసము
తీయవలెనన్న అతి ప్రయాసము
ఇతర సాధనలు అదే విధము
అయి పోగలవు అనితర సాధ్యము

జ్ఞానదేవులు తెలిపిరి వినుము
నివృత్తినాథుని కృపా ప్రసాదము;
ఒసగిరి దయతో నిర్గుణ దైవము
చేతికి అందెను హరి సంపూర్ణము






# హరి పాఠము



## అభంగ్ - 13

సమాధీ హరీచీ సమసుఖే వీణ్!
న సాధేల్ జాణ్ ద్వైత బుద్ధీ!!

బుద్ధీ చే వైభవ్ అన్య్ నాహీ దుజే!
ఏకా కేశవ రాజే సకళ సిద్ధీ!!

రిద్ధీ సిద్ధీ నిధీ అవఘీచ్ ఉపాధీ!
జవ్ త్యా పరమానందీ మన్ నాహీ!!

జ్ఞానదేవీ రమ్య్ రమలే సమాధాన్!
హరీ చే చింతన్ సర్వకాళ్!!

**భావము :**

సమసుఖము కలుగక పూర్వము శ్రీహరిలో సమాధి సుఖాన్ని పొందజాలము. ద్వైత బుద్ధి ఉన్నంత కాలము సమసుఖము సాధ్యము కాదు.

బుద్ధి యొక్క వైభవము అన్యముగా రెండవది ఏదీ లేదు.

ఒక్క కేశవరాజే సకల సిద్ధులకు మూల కారణము.

పరమానందునిలో మనసు స్థిరముగ లేనిచో ఈ రిద్ధీ-సిద్ధీ, నిధులు సర్వము అవసరము లేని ఉపాధులే అయిపోతాయి.

హరి చింతనలో సర్వకాలము నా మనసు రమించి లీనమై పోవుట వలన నాకు సమాధానము లభించినదని జ్ఞానదేవులు తెలిపినారు.




## నామ సుధ -13

సమసుఖము కలుగక పూర్వము
హరిలో సమాధి పొందజాలము
ద్వైత బుద్ధి ఉన్నంత కాలము
సమ సుఖ:ము కాదు సాధ్యము

ఇలలో బుద్ధికి మరో వైభవము
రెండవది లేదు అన్యము
ఒక కేశవ రాజే దానికి మూలము
సకల సిద్ధులకు ఆధారము

రిద్ధీ సిద్ధీ నిధీ ఇవి సర్వము
ఉపాధులన్నీ అనవసరము
మనుస్సునందు పరమాత్ముని భావము
లేని ప్రయాస నిరుపయోగము

జ్ఞాన దేవునిలో రమించే నామము
అంతరంగమున సమాధానము
హరి చింతనలో సర్వ కాలము
గడిపిరి వారు నిరంతరము






# హరి పాఠము



## అభంగ్ - 14

నిత్య సత్యమిత్ హరిపాఠ్ జ్యాసీ!
కళికాళ్ త్యాసీ న పాహే దృష్టీ!!

రామకృష్ణ ఉచ్చార్ అనంతరాశీ తప్
పాపాచే కళప్ పళతీ పుఢే!!

హరి హరి హరి హా మంత్ర్ శివాచా!
మ్హణ తీ జే వాచా తయా మోక్ష్!!

జ్ఞానదేవా పాఠ్ నారాయణ నామ్!
పావిజే ఉత్తమ్ నిజస్థాన్!!

**భావము :**

నిత్య సత్యమైన హరి పాఠమును అమితముగా పాడే వారిని కలికాలము కన్నెత్తి కూడా చూడదు.

రామ కృష్ణ నామోచ్ఛరణ అనునది అనంతరాశుల తప: ఫలముతో సమానము కావున వారి పాప సమూహమంత ముందుకు పారిపోతుంది.

హరి హరి హరి అని శివుడు జపించే ఈ మంత్రమును నాలుకతో పాడే వారికి మోక్షము లభించును.

నారాయణ నామాన్ని పాడిన వారు నిజధామాన్ని పొందగలరని జ్ఞానదేవులు తెలిపినారు.




## నామ సుధ -14

నిత్య సత్యము మరియు అమితము
హరి పాఠమును పాడు చుండుము
వారి వైపు కలికాలము
కన్నెత్తి చూడదు కనుగొనుము

రామకృష్ణ నామోచ్చారణము
అనంత రాశుల తప: ఫలము
అనేక జన్మల పాప సమూహము
పారిపోవును ముందుకు గనుము;

హరి హరి హరి అను మంత్రము
శివుడు జపించెను నిరంతరము
నాలుకతోడ ఎల్లకాలము
జపించు వారికి లభించు మోక్షము

జ్ఞాన దేవుని నిత్య పాఠము
పాడిరి వారు నారాయణ నామము
పొందినారు ఉత్తమ స్థానము
చేరినారు నిజ ధామము






# హరి పాఠము



## అభంగ్ - 15

ఏక్ నామ హరీ ద్వైత నామ దురీ!
అద్వైత కుసరీ విరళా జాణే!!

సమబుద్ధి ఘేతా సమాన్ శ్రీహరీ!
శమ దమావరీ హరీ ఝాలా!!

సర్వా ఘటీ రామ్ దేహాదేహీ ఏక్!
సూర్య ప్రకాశక్ సహస్ర రశ్మీ!!

జ్ఞానదేవా చిత్తీ హరిపాఠ్ నేమా!
మాగిలియా జన్మా ముక్త్ ఝాలో!!

**భావము :**

హరినామము ఏక తత్వము కానీ ద్వైత నామాలను దూరము చేసి అద్వైత మార్గమును చేపట్టిన వారు బహు అరుదుగా ఉన్నారు. అని తెలుసుకో..

సమ బుద్ధితో వీక్షించి అంతట సమానముగ శ్రీహరి ఉన్నాడు అని తెలుసుకున్న వెంటనే శమధమాలను అధిగమించి హరి రూపము అయిపోతావు.

సూర్యుడు ఒక్కడే కిరణాలు అనేకముగ ఉన్నట్లు దేహమందు దేహిగ సర్వ ఘటాలలో రామ తత్వము ఒక్కటే ఉన్నది.

హరి పాఠనేమమును చిత్తమునందు నిలిపి పఠించే వారి వెనుకటి జన్మలు ముక్తి కాగలవని జ్ఞానదేవులు తెలిపినారు.




## నామ సుధ -15

హరి ఒక్కడే హరి నామాలనేకము
ద్వైత నామాలను చేయుము దూరము
హరియే సమగ్ర అద్వైత తత్వము
ఎరిగిన భక్తులు బహు దుర్లభము

సమ బుద్ధితో యోచించుము
సమానము శ్రీహరియని గాంచుము
శమ దమాలు ఉడిగిన ఆనంతరము
మిగిలి యుందువు శ్రీహరి రూపము

సర్వ దేహాలలో రామ తత్వము
"దేహి దేహము ఏకరూపము"
సూర్యుడు ఒక్కడే కిరణాలనేకము
నామి ఒక్కడే నామాలనేకము

జ్ఞాన దేవునిది ఏక చిత్తము
నిరంతరము హరిపాఠ నేమము
పూర్వ జన్మ కర్మలు సహితము
ముక్తి నొందునని తెలిపెను వినుము






# హరి పాఠము



**అభంగ్ - 16**

హరి బుద్ధీ జపే తో నర దుర్లభ్!
వాచేసి సులభ్ రామకృష్ణ్!!

రామకృష్ణ్ నామీ ఉన్మనీ సాధిలీ!
తయాసీ లాధలీ సకళ్ సిద్ధీ!!

సిద్ధీ బుద్ధీ ధర్మ్ హరిపాఠీ ఆలే!
ప్రపంచీ నివాలే సాదు సంగే!!

జ్ఞానదేవీ నామ రామకృష్ణ రసా!
యెణే దశదిశా ఆత్మారామ్!!

**భావము :**

రామ కృష్ణ నామము నాలుకతో పలుకడము చాలా సులభము అయిన కాని హరి నామ జపము చేయాలనే బుద్ధి కలిగే నరులు దుర్లభము

రామకృష్ణ నామము మనుసును ఉన్మనిస్థితికి చేర్చును. అప్పుడు వారికి సకల సిద్ధులు లభించును.

హరిపాఠము పఠించే వారికి సిద్ధి, బుద్ధి మరియు ధర్మాలు తెలిసిపోయి సాధువుల సాంగత్యముతో ప్రాపంచీకుల మనసు నిశ్చలమగును.

నామ స్మరణ వలన రామకృష్ణ స్వరూప ముద్రాంకితులై వారికి దశదిశలయందు ఆత్మారాముడు దర్శనమిస్తాడని జ్ఞానదేవులు తెలుపుచున్నారు.




## నామ సుధ -16

హరి బుద్ధితో నామ జపము
చేయు నరులు బహు దుర్లభము
పలకడానికి అతి సులభము
రామకృష్ణుల మధుర నామము

రామ కృష్ణనామ ధ్యానము
మనసును హరిలో చేయునిమగ్నము
వెంబడించును సిద్ధులు సర్వము
అయినవి వారికి వెంటనే ప్రాప్తము

సిద్ధిబుద్ధి మరియు ధర్మము
హరిపాఠకునిలో చేరును సులభము
సాధు జనులతో సాంగత్యము
ప్రాపంచీకుల మనసు నిశ్చలము

జ్ఞానదేవునిలో హరినామము
రామ కృష్ణ ముద్రాంకితము
దశ దిశలందున భవ్య రూపము
ఆత్మారాముని దివ్యదర్శనము






# హరి పాఠము



## అభంగ్ - 17

హరి పాఠ్ కీర్తి ముఖే జరీ గాయ్!
పవిత్రచి హెూయ్ దేహ త్యాచా!!

తపాచే సామర్థ్యే తపిన్నలా అమూప్!
చిరంజీవ కల్ప్ వైకుంఠీ నాందే!!

మాతృ పితృ భ్రాతా సగోత్ర్ అపార్!
చతుర్భుజ్ నర హెూవూని ఠేలే!

జ్ఞాన గూఢగమ్య జ్ఞానదేవా లాధలే!
నివృత్తీనే దిధలే మాఝ్యా హాతీ!!

**భావము :**

హరి పాఠము యొక్క కీర్తిని నోరార గానము చేసిన ఫలితముగ వారి దేహము పవిత్రమై పోగలదు.

తప: శక్తి యొక్క సామర్థ్యముతో అమితముగ తపించినవాడు కల్పాంతము వరకు చిరంజీవియై వైకుంఠమందు నివసించును.

తల్లిదండ్రులు బంధు సమూహము మరియు అన్నదమ్ములు గోత్రీకులు సైతం చతుర్భుజ నరులై అందరు స్థిరపడతారు.

నా గురుదేవులు నివృత్తినాథులు జ్ఞానమందలి నిగూఢ రహస్యము అయిన గమ్యాన్ని చేర్చు హరి నామాన్ని నా చేతిలో పెట్టినారని జ్ఞానదేవులు తెలిపినారు.




## నామ సుధ -17

హరిపాఠ కీర్తిని గానము
నోరార పాడిన ఫలితము
పవిత్రమయి పోవును దేహము
హరినామ మహిమ అపారము

తప:శక్తి నిండిన సామర్థ్యము
తపించినాడు అమిత తపము
చిరంజీవియై కల్పాంతము
నివసించినాడు వైకుంఠధామము

తల్లిదండ్రులు బంధు సమూహము
సగోత్రికుల పరివారమపారము
చతుర్భుజులై నరుల స్వరూపము
అయిపోవుదురు అందరు స్థిరము

జ్ఞానములోని నిగూఢ గమ్యము
జ్ఞానదేవునికి లభించిన ఫలము
నివృత్తినాథుని కృపా ప్రసాదము
అప్పగించెను హరినామము






# హరి పాఠము



## అభంగ్ - 18

హరివంశ పురాణ్ హరినామ సంకీర్తన్!
హరి వీణ సౌజన్య్ నేణేకాహీ!!

తయా నరా లాధలే వైకుంఠ్ జోడలే!
సకళహీ ఘడలే తీర్థాటన్!!

మనోమార్గేగేలా తో తెథే ముకలా!
హరిపాఠీ స్థిరావలా తోచి ధన్య్!!

జ్ఞానదేవా గోడీ హరి నామాచీ జోడీ!
రామకృష్ణీ ఆవడీ సర్వకాళ్!!

**భజన**

॥ జయ్ విఠోబా రుఖమాయి ॥

**భావము :**

హరి వంశ పురాణాలు చదవడము హరినామ సంకీర్తన చేయడము నాకు ఇష్టము. హరిని మించిన బంధువు నాకు తెలియనే తెలియదు.

అట్టి నరుడికి వైకుంఠము ప్రాప్తించి అన్ని తీర్థాలు తిరిగిన ఫలితము లభించగలదు.

మనో మార్గమున నడిచే వాడు అక్కడనే ముక్కి చెడి పోవును. హరి పాఠమును మనసునందు స్థిరము చేసిన వారే ధన్యులు.

హరినామము నా నిల్వ ధనము రామకృష్ణ నామము నాకు ప్రియము. కావున నేను సర్వకాలములందు హరిపాఠము పాడినానని జ్ఞానదేవులు తెలుపుచున్నారు.




# నామ సుధ -18

హరివంశ పురాణము చదువుము
హరినామ సంకీర్తన పాడుము
హరిని మించిన సౌజన్యము
లేదు నాకు అన్య ఆధారము

అట్టి నరునిది పరమభాగ్యము
చేరి పోవును వైకుంఠ ధామము
తీర్థాలన్నియు తిరిగిన ఫలితము
హరినామమున సకలము సిద్ధము

నడిచే వాడు మనో మార్గము
నశించి పోవును తథ్యము కనుము
హరి పాఠమున మనసు స్థిరము
చేసిన వారిదే ధన్య జీవనము

జ్ఞానదేవునికి అయినది మధురము
హరినామమే నిలువ ధనము
రామకృష్ణ నామము ప్రియము
పాడిరి వారు సర్వకాలము






# హరి పాఠము



## అభంగ్ - 19

వేదశాస్త్ర ప్రమాణ్ శృతీచే వచన్!
ఏక్ నారాయణ్ సార్ జప్!!

జప్ తప్ కర్మ్ హరి విణ ధర్మ్!
వా ఉగాచి శ్రమ వ్యర్థ జాయ్!!

హరిపాఠీ గేలే తే నివాంతచి ఠేలే!
భ్రమర గుంతలే సుమన్ కళికె!!

జ్ఞానదేవీ మంత్ర హరినామాచే శస్త్ర!
యమే కుళగోత్ర వర్జియలే!!

**భావము :**

ఒక్క నారాయణ నామమే సారమని వేధ శాస్త్రాల ప్రమాణము కలదు. మరియు శృతులు కూడా అదే మాట చెప్పినవి. కావున నామ జపము చేయవలెను.

జపము, తపము మరియు కర్మలు హరినామము లేని ఏ ఇతర ధర్మాలైనా అనవసరమైన శ్రమ. సమయమంత వ్యర్థమై పోవును.

కమలముపై వ్రాలి మకరందమును గ్రోలుచున్న తుమ్మెద తీరుగ. హరిపాఠమును అనుసరిస్తూ నడిచే వారంత ఆనందంగా జీవిస్తారు.

హరినామము ఒక దివ్యమైన శస్త్రము. నామ పఠనము చేసే వారి కుల గోత్రీకులను కూడ యముడు పట్టజాలడని జ్ఞానదేవులు తెలుపుచున్నారు.




## నామ సుధ -19

వేద శాస్త్రాల ప్రమాణము
శృతులు చెప్పిన వచనము
నారాయణ నామమే సారము
నామ జపము తరుణో పాయము

జపతప కర్మలు సర్వము
హరినామము వీడిన ధర్మము
"పనికి మాలిన కష్టము
వ్యర్థమయ్యెను జీవితము"

హరిపాఠమున ప్రయాణము
అయినారు వారు సుస్థిరము
తుమ్మెద గ్రోలిన చందము
కమలములోని మకరందము;

జ్ఞానదేవుని మంత్రము
హరినామము దివ్య శస్త్రము
కుల గోత్రీకులను సహితము
వర్జించును యముడు సత్యము






# హరి పాఠము



## అభంగ్ - 20

నామ సంకీర్తన్ వైష్ణవాంచీ జోడీ!
పాపే అనంత్ కోడీ గేలీ త్యాంచీ!!

అనంత్ జన్మాంచే తప్ ఏక్ నామ్!
సర్వ మార్గ్ సుగమ్ హరిపాఠ్!!

యోగ యాగ క్రియా ధర్మాధర్మ్ మాయా!
గేలేతే విలయా హరి పాఠీ!!

జ్ఞానదేవీ యజ్ఞ్ యాగ్ క్రియా ధర్మ్!
హరివిణ నేమ్ నాహీ దుజా!!

**భావము :**

వైష్ణవులకు నామ సంకీర్తన మూలధనము. నామ జపము చేసే వారి అనంత కోటి పాపాలు తొలిగి పోతాయి.

ఒక్క హరి నామ జపము అనంత జన్మల తపస్సుతో సమానము. హరి పాఠము అన్ని మార్గాలలో సుగమము.

యోగ, యాగ, క్రియ, మరియ ధర్మాధర్మ మాయ, మోహము అన్నియు నామ సాధనతో పాఠకునిలో విలయమై పోతాయి.

యజ్ఞము, యాగము, క్రియలు, ధర్మాలు అన్నియూ నాకు హరినామమే. హరి నామము తప్ప ఇతర అన్య నేమములు ఏమియూ లేవని జ్ఞానదేవులు తెలిపినారు.




## నామ సుధ -20

నామ సుధా సంకీర్తనము
వైష్ణవులకు మూల ధనము
అనంత కోటి పాప సమూహము
అయిపోయినది అంతా మాయము

అనంత జన్మలు చేసిన తపము
సమానము ఒక్క హరినామము
సర్వ మార్గములలో సుగమము
హరిపాఠ నామ సంకీర్తనము

యోగ యాగ క్రియలు సర్వము
ధర్మాధర్మ మాయ మోహము
నామ సాధనతో అవును విలయము
హరి పాఠ మహిమ అమోఘము

జ్ఞానదేవునికి నామమే యజ్ఞము
యాగము క్రియ మరియు ధర్మము
అన్నియు నాకు హరినామము
హరిని విడిచి లేదు అన్యనేమము






# హరి పాఠము



## అభంగ్ - 21

కాళ్ వేళ్ నామ్ ఉచ్చారితా నాహీ!
దోన్హీపక్ష్ పాహీ ఉద్ధరతీ!!

రామకృష్ణ నామ సర్వదోషా హరణ్!
జడజీవా తారణ్ హరి ఏక్!!

హరి నామ సార్ జివ్హా యా నామాచీ!
ఉపమా త్యా దైవాచీ కోణ్ వానీ!!

జ్ఞానదేవా సాంగ్ ఝూలా హరిపాఠ్!
పూర్వజా వైకుంఠ్ మార్గ్ సోపా!!

**భావము :**

నామోచ్ఛారణ చేయడానికి కాల వేళాదుల నియమము ఏమీ లేదు. నామ స్మరణ చేయువారి ఇరు పక్షాలు ఉద్ధరించి పోతాయి.

రామకృష్ణ నామము సర్వ దోషాలను హరించి వేయును. ఒక్క హరి నామమే జడ జీవులను తరించి వేయగలదు.

హరినామ సారము యొక్క రుచి మరిగిన నాలుక దైవమును వర్ణించి చెప్పడము ఎవ్వరికి సాధ్యము కాదు.

హరిపాఠమును పఠించి హృదయస్థము చేసుకున్న వారి పూర్వజులకు కూడ వైకుంఠ మార్గము సులభము కాగలదని జ్ఞానదేవులు తెలుపుచున్నారు.




## నామ సుధ -21

లేదు కాల వేళాదుల నియమము
ఉచ్ఛరించుటకు హరి నామము
ఇరు పక్షముల పరివారము
అయిపోవుదురు ఉద్ధారము

రామకృష్ణ మధుర నామము
సర్వదోషహరణ కారణము
జడజీవులను తరించడము
హరి ఒకడికే ఇది సాధ్యము

హరినామము వేద సారము
నామ రుచి మరిగిన నాలుక భాగ్యము;
వర్ణింపనెవరి వైఖరి తరము
ఆ భక్త జనుల దైవ వైభవము

జ్ఞానదేవుని నామకీర్తనము
అయిపోయినది పరిపూర్ణము
పూర్వజులకు వైకుంఠ మార్గము
సులభముగా అయినది సాధ్యము






# హరి పాఠము



## అభంగ్ - 22

నిత్యనేమ నామీ తే ప్రాణీ దుర్లభ్!
లక్ష్మీ వల్లభ్ తయా జవళీ!!

నారాయణ హరి నారాయణ హరి!
భుక్తి ముక్తి చారీ ఘరీ త్యాంచ్యా!!

హరి వీణ్ జన్మతో నర్కచి పై జాణా!
యమాచా పాహుణా ప్రాణీ హెూయ్!!

జ్ఞానదేవ పుసే నివృత్తీసీ చాడ్!
గగనాహూని వాడ్ నామ ఆహే!!

**భావము :**

నిత్మ నేమముతో హరి నామ జపము చేసే నరులు బహు దుర్లభము, కాని ఇలా జపము చేసే వారి వద్ద లక్ష్మీవల్లభుని నివాసము ఉండును.

నారాయణ హరి..నారాయణ హరి.. అని నామ పఠనము చేయువారి ఇంటిలో భుక్తి  నాలుగు ముక్తులు నివాసముండును.

హరిని వదిలిన జన్మము నరకమే అని తెలుసుకో.. ఈ ప్రాణులు యమునికే బంధువులు.

నామ మహిమను జ్ఞానదేవుడు వర్ణించమని అడుగగా ఆకాశముకన్న మిన్న నామమని నివృత్తినాథులు తెలిపినారు.




## నామ సుధ -22

నిత్య నేమమున నామ స్మరణము
చేయుప్రాణులే బహు దుర్లభము
హృదయమందున స్థిర నివాసము
లక్ష్మికాంతుని నిజ స్వరూపము

నారాయణ హరినామ పాఠము
నిత్య నేమమున చేయు జపము
భుక్తి మరియు ముక్తి చతుష్టము
ఉండును వారి ఇంట నివాసము

హరిని భజించని జన్మము వ్యర్థము
నరకము అదియని తెలుసుకొనుము
తప్పదు జీవికి యముని పాశము
భక్తి హీనులకు నరక నివాసము

జ్ఞానదేవులు అడిగిరి వినుము
నివృత్తినాథున్ని తత్వ విచారము
గగనము కన్న మిన్న నామము
అని చెప్పినారు దివ్య జ్ఞానము






# హరి పాఠము



## అభంగ్ - 23

సాత్ పాచ్ తీన్ దశకాంచా మేళా!
ఏక తత్త్వీ కళా దావీ హరి!

త్రైసే నవ్హేనామ్ సర్వత్ర వరిష్ఠ్!
యేథే కా హీ కష్ట్ న లగతీ!!

అజపా జపణే ఉలట్ ప్రాణాచా!
తెథేహి మనాచా నిర్ధారు అసే!!

జ్ఞానదేవా జిణే నామే వీణ్ వ్యర్థ్!
రామకృష్ణీ పంథ్ క్రమీయేలా!!

**భావము :**

ఏడు, ఐదు, మూడు మరియు పది, ఈ తత్త్వాల కలయిక అంతా మిథ్యాభాసము. దీనినంత ఒక్కటే తత్త్వములో శ్రీహరి చూపినారు.

నామము అన్ని మార్గములలో వరిష్ఠమైనది. నామ మార్గము స్వీకరించుటకు ఎలాంటి కష్టము కూడ కాదు.

అజపాజపము వాణి విషయము కాదు. కావున లోనికి బయటకు ప్రవహిస్తున్న ఉఛ్ఛ్వాస నిశ్వాసలపై మనసు నిర్ధారము చేయుము.

నామము లేనిది అంతా వ్యర్థము కావున నేను రామకృష్ణుల పంతము పట్టినానని జ్ఞానదేవులు తెలిపినారు.




## నామ సుధ -23

ఏడు, ఐదు, మూడు దశక సమూహము
ఇరువది ఐదుల కూడిక దేహము
ఈ కళలన్నీయు మిథ్యాభాసము
శ్రీహరి చూపెను ఒక్కటే తత్త్వము

ఆ విధముగ లేదు నామము
అన్ని మార్గములలో ఇదే వరిష్ఠము
"ఇష్టము ఉన్న కాదు కష్ఠము"
ఈ విధానము సులభతరము

అజపాజపము ప్రాణ ప్రవాహము
కాదుర సుమతీ వాణి విషయము
ప్రవహిస్తున్న ఉఛ్వాస నిశ్వాసము
అక్కడ మనసు నిర్ధారము చేయుము

జ్ఞానదేవుల పలుకులు వినుము
నామము మరిచిన బ్రతుకు వ్యర్థము
రామకృష్ణుల నడత భవ్యము
చెప్పినడిచిరి లోక ప్రసిద్ధము






# హరి పాఠము



## అభంగ్ - 24

జప తప్ కర్మ్ క్రియా నేమ ధర్మ్!
సర్వా ఘటీ రామ్ భావ శుద్ధ్!!

న సోడీ రే భావో టాకీరే సందేహూ!
రామకృష్ణీ టాహూ నిత్య ఫోడీ!!

జాత్ విత్త్ గోత్ కుళ్ శీళ్ మాత్!
భజే కా త్వరిత్ భావనాయుక్త్!!

జ్ఞానదేవా ధ్యానీ రామకృష్ణ మనీ!
తేణే వైకుంఠ భువనీ ఘర్ కేలే!!

**భావము :**

జపము, తపము, కర్మలు, క్రియలు, నేమాలు మరియు ధర్మాలు ఏదైన కాని సర్వ ఘటాలలో రామ భావము పరిశుద్ధిగ కలిగి యుండి నేమాలు ఆచరించ వలెను.

భావము వదలకూడదు, సందేహము వదిలి నిత్యము రామకృష్ణుల భజన చేయవలెను.

జాతిని, విత్తాన్ని, గోత్రాన్ని, కులమును, శీలాన్ని మరియు అభిమానాన్ని వదిలి, వేగిరపడి భావ యుక్తముగ భజన చేయుము.

నిరంతరము రామకృష్ణులలో మనసు నిలిపి ధ్యానము చేయుట వలన నేను వైకుంఠ భువనములో నివాసము ఏర్పరుచుకున్నాను అని జ్ఞానదేవులు తెలిపిరి.




## నామ సుధ -24

జపము తపము కర్మ యుక్తము
క్రియయు నేమము మరియ ధర్మము
సర్వఘటములో రామ తత్త్వము
శుద్ధ భావనతో చేయు నేమము

ఎల్లవేళల వదలకు భావము
సందేహమును వదిలి పెట్టుము
రామ కృష్ణులను మరువక యుండుము
నిత్య నేమమున కీర్తన చేయుము

జాతి విత్తము మరియు గోత్రము
కులముశీలము వదిలివేయుము
వేగిర పడి భజన చేయుము
భావన ఎప్పుడు మదిలో నిలుపుము

జ్ఞానదేవుని మనసున ధ్యానము
రామ కృష్ణులది నిరంతరము
దానితో వారికి వైకుంఠ భువనము
లభించినాది లోక ప్రసిద్ధము






# హరి పాఠము



**అభంగ్ - 25**

జాణీవ్ నేణీవ్ భగవతీ నాహీ!
ఉచ్చారణీ పాహీ మోక్ష సదా!

నారాయణ హరీ ఉచ్చార్ నామాచా!
తేథే కళికాళాచా రీఘ్ నాహీ!!

తేథీల్ ప్రమాణ్ నేణవే వేదాసీ!
తే జీవ జంతూ సీ కేవి కళే!!

జ్ఞానదేవా ఫళ్ నారాయణ పాఠ్!
సర్వత్ర్ వైకుంఠ్ కేలే అసే!!

**భావము :**

బుద్ధి తెలిసిన వాడా! తెలియని వాడా! అనే భేదభావము భగవంతుడి వద్దలేదు. నామోచ్ఛారణ చేయు వారందరికి సదా మోక్షమును ఇచ్చును.
నారాయణ హరి అని నామ ఉచ్చారణ చేయు వారికి కలికాలముది, మరియు కాలుడిది. భయమే లేదు.
ఆ దేవుడి లీలలు వేదాలకు తెలియ జాలవు. మరి జీవజంతులకు తెలియుట ఎలా సాధ్యము.?
నారాయణ నామ పఠనము యొక్క ఫలము నాకు అంతట వైకుంఠము వలెనే అగుపించినదని జ్ఞానదేవులు తెలిపినారు.




## నామ సుధ -25

జ్ఞాని అజ్ఞానియని లేదు భేదము
భగవంతునికి అందరు సమానము
ఉచ్ఛరించినంతనే పలికేటి దైవము
చల్లగ చూసి ఇచ్చేను మోక్షము

నారాయణ హరినామ గీతము
మరవకుండగ పాడుచుండుము
కన్నెత్తి చూడదు కలి కాలము
సాగదు ఇచ్చట కాలుని పాశము

దేవుడి యొక్క సమగ్ర ప్రమాణము
తెలుసుకో జాలదు వేదము
జీవ జంతువులకు ఎలా సాధ్యము
హరి చరణములే మనకు శరణ్యము

జ్ఞానదేవునికి లభించిన ఫలము
నారాయణహరి నామ పఠనము
సర్వత్రము వెలిసెను వైకుంఠము
కలిగెను వారికి నామ అనుభవము






# హరి పాఠము



## అభంగ్ - 26

ఏక తత్త్వ నామ దృఢ ధరీ మనా!
హరీసీ కరుణా యేఈల్ తుఝీ!!

తే నామ్ సోపారే రామకృష్ణ గోవింద్!
వాచేశీ సద్గద్ జపే ఆధీ!!

నామా పరతే తత్త్వ నాహీరే అన్యథా!
వాయా ఆణికా పంథా జాశీ ఝణీ!!

జ్ఞానదేవా మౌన్ జపమాళ్ అంతరీ!
ధరోనీ శ్రీహరీ జపే సదా!!

**భావము :**

ఓ మనసా.! నామము ఏక తత్త్వము, కావున దానిని ధృఢముగ పట్టినచో నీకు శ్రీహరి కరుణ లభించగలదు.

నాలుకతో పాడడానికి అన్నింటికంటె సులభ సాధనము రామకృష్ణ గోవింద అనే నామాలు. ఈ నామములను ఎల్లప్పుడు జపించు చుండవలెను.

నామానికి మించిన తత్త్వము వేరుగ ఏమీ లేదు. కావున అనవసరముగ ఇతర పంథములను అనుసరించకుము.

అంతరాత్మ యందు శ్రీహరిని పట్టుకొని మౌనముగ జపము చేయుచున్నానని జ్ఞానదేవులు తెలుపు చున్నారు.




## నామ సుధ -26

ఏక తత్త్వము దేవుని నామము
దృఢతరమున మనసున నిలుపుము
శ్రీహరి కరుణను నోచుకొనుము
ఆత్మానందమున పరవశించుము

రామకృష్ణ గోవిందనామము
పలుకుటకది బహుసరళము
నాలుకనుంచుము ఎల్లకాలము
ఆలసింపక జపము చేయుము

హరినామానికి మించిన తత్వము
లేదు అన్యము సాధన శూన్యము
ఇతర పంథము దుఃఖ మూలము
అనవసరము వ్యర్థ మార్గము

జ్ఞానదేవుని సాధన మౌనము
అంతరంగమున నామ జపము
పట్టుకొనెను శ్రీహరి నామము
జపము చేసెను ఎల్లకాలము






# హరి పాఠము



## అభంగ్ - 27

సర్వసుఖ గోడీ సాహీ శాస్త్ర నివడీ!
రికామా అర్థఘడీ రాహూ నకో!!

లటికా వ్యవహార్ సర్వహా సంసార్!
వాయా యేర్ ఝూర్ హరీ వీణ్!!

నామ మంత్ర జప కోటీ జాఈల్ పాప్!
కృష్ణనామీ సంకల్ప్ ధరూని రాహే!!

నిజ వృత్తి కాఢీ సర్వ మాయా తోడీ!
ఇంద్రియా సవడీ లపోనకో!!

తీర్థవ్రతీ భావ ధరీ రే కరుణా!
శాంతీ దయా పాహుణా హరి కరీ!!

జ్ఞానదేవా ప్రమాణ్ నివృత్తిదేవీ జ్ఞాన్!
సమాధి సంజీవన్ హరి పాఠ్!!

## భావము :

సర్వ సుఖాలలో హరి నామము మధురమైనదని ఆరు శాస్త్రాలు ఎన్నిక చేసి చెప్పినవి. కావున అర నిమిషము కూడ వృధా గడప బోకుము. సంసారమంత క్షణ భంగురము. కావున హరి సంబంధము వీడినచో చావు పుట్టుకలు వ్యర్థమై పోతాయి. కృష్ణ నామమందు మనసు పెట్టి సంకల్పము చేసి నామ మంత్రమును జపము చేయు వారి కోటి పాపాలు తొలగిపోతాయి. సర్వ మాయలను త్రుంచి వేసి నిజ వృత్తులను బయటకు తీసి ఇంద్రియాలబడి తిరుగక జాగురుకతో ఉ ండుము. భావన పెట్టి తీర్థవ్రతాలు చేయుట వలన శాంతి, దయ నీకు ప్రియ బాంధవులై హరి యొక్క కరుణ ప్రాప్తించగలదు. సద్గురువు నివృత్తినాథులు కృపతో ఇచ్చిన జ్ఞానము వలన నాకు సంజీవని సమాధి కలిగినదని జ్ఞానదేవులు ప్రమాణ పూర్వకంగా తెలిపినారు.

## నామ సుధ -27

సర్వ సుఖాలలో అతి మధురము
సకల శాస్త్రాలు ఎన్నిన నామము
వృధాగడపకు అర నిమిషము
హరినామము గానము చేయుము

స్వప్నంలాంటిది వ్యవహారము
సంసారమంత అదే విధము
వ్యర్థమవును జనన మరణము
లేని యెడల హరి సంబంధము

నామ మంత్రము జపము చేయుము
కోట్ల కొలది పాపాలు మాయము
సంకల్పము చేసి కృష్ణనామము
దృఢతరమున పట్టు నిలుపుము

నిజవృత్తులను బయటకు తీయుము
మాయలన్నియు తుడిచి వేయుము
"ఇంద్రియాలబడి తిరుగబోకుము"
వివేకముతో అణిచి వేయుము

తీర్థవ్రతము భావ బలము
కరుణా హృదయము కల్గిఉండుము
శాంతి దయా ప్రేమ యుక్తము
ధృఢమై తీరును హరి సంబంధము

జ్ఞానదేవుని ప్రమాణము వినుము
నివృత్తినాథులు ఇచ్చిన జ్ఞానము
సమాధి సంజీవని హరి పాఠము
భక్త జనులకు తరుణోపాయము



# హరి పాఠము



## అభంగ్ - 28

నామ సంకీర్తన సాధన పై సోపె!
జళతీల పాపె జన్మాంతరీచీ!!

న లగతి సాయాస జావే వనాంతర్!
సుఖే యేతో ఘరా నారాయణ!!

ఠాయీచ్ బైసోని కరా ఏక చిత్త!
ఆవడి అనంత ఆళవావా!!

రామకృష్ణ హరి విఠ్ఠల కేశవా!
మంత్ర హా జపావా సర్వాకాళీ!!

యా వీణ ఆణిక అసతా సాధన!
వాహా తసే ఆణ విఠోబాచి!!

తుకామ్హణె సోపే ఆహె సర్వా హూని!
శాహాణా తో ధణి ఘేతో ఏథే!!

**భావము :**

సాధనలన్నింటిలోను నామ సంకీర్తన చాలా సులభము. ఈ నామము జన్మజన్మాంతరాల పాపాలను భస్మము చేయగలదు.

వ్యయప్రయాసలు పడకుండానే అడవుల యందు తిరగనవసరము లేకుండానే సుఖ సమేతముగా నారాయణుడే నీ ఇంటికి నడిచి వచ్చును.

సుఖాసనముపై స్థిరముగా కూర్చుండి ఏకాగ్ర చిత్తముతో ప్రేమ పూర్వకముగ అనంతుడిని ఆలాపించవలెను.

రామ కృష్ణ హరి.. విఠ్ఠల..కేశవ అనే ఈ మంత్రమును సర్వకాలముల యందు జపించ వలెను.

ఇంతకు మించి ఇతర సాధన ఏదీ లేదని నేను విఠ్ఠలునిపై ఒట్టు వేసి చెప్పుచున్నాను.

వివేకశీలురు అన్ని మార్గములలోకి సులభమార్గమైన నామ సాధనను చేపట్టి తృప్తి చెందినారని తుకారాం మహారాజ్ తెలిపినాడు.

## నామ సుధ -28

నామ సంకీర్తన అతీ మధురము
సాధనలందు ఇదే సులభము
జన్మాంతరాల పాప సమూహము
భస్మమౌను ఇదియే నిక్కము

పాడుట నీకు కాదు ప్రయాసము
లేదు అడవికి వెళ్లనవసరము
నారాయణుడే సుఖ స్వరూపము
నడిచి వచ్చును ఇంటికి స్వయము

సుఖాసనముపై కూర్చొని ఉండుము
హరిపై నిలుపుము ఏక చిత్తము
ప్రేమ యుక్తముగా ఆలాపించుము
బ్రహ్మానందము అనుభవించుము

రామకృష్ణ హరి విఠ్ఠల కేశవా
మంత్రము జపించు సర్వకాలము
నామములోని మహిమ అపారము
వెంటనే ఇచ్చును సుఖాలు సర్వము

దీనికి మించిన ఇతర సాధనము
వెదికి చూసినా లేదు అన్యము
అన్య సాధనలు బహు దూరము
విఠ్ఠలునిపై ఆన వినుము

అన్నింటికంటే ఇదే సులభము
నిత్యము పాడు వెంటనే నామము
బుద్ధివంతుడవై తీసుకొనుము
తుకారాముడు చెప్పిన నామము

# శ్రీ జ్ఞానేశ్వర్ మహారాజ్ ఆరతీ

ఆరతి జ్ఞాన రాజా ! మహా కైవల్య తేజా
సేవితి సాధూ సంత మను వేధిలా మాఝూ
ఆరతీ జ్ఞానరాజా !!

లోపలే జ్ఞాన జగీ ! హిత నేణతీ కోణి !
అవతార పాండురంగ ! నామ ఠేవిలే జ్ఞాని !!
ఆరతీ జ్ఞానరాజా !!

ప్రగట గుహ్యా బోలే ! విశ్వ బ్రహ్మోచి కేలే
రామా జనార్ధనీ ! పాయి మస్తక ఠేలే !!
ఆరతి జ్ఞానరాజా! మహా కైవల్య తేజా !

# ఆరతీ

కరూనీ ఆరతీ । చక్రపాణీ వోవాలితీ ॥
ఆజి పురలె నవస్ । ధన్య కాల్ హ దివస్ ॥
సాహా సాహా వో సకళా । పుణ్యవంత తుమ్హీ బాళా ॥
తుకా వాహె టాళి । ఉభా సన్నిధ జవళి ॥

# మణ్హాతి జ్ఞానాబాయి ఆయి

అభంగ్॥ సర్వసుఖాచీ లహోరి - జ్ఞానాబాయి అలంకాపురి
శివపీఠ్ హే జునాట్ - జ్ఞానాబాయి తెథే ముగుట్
వేదశాస్త్రే దెతీ గవాహి - మణ్హాతి జ్ఞానాబాయి ఆయి
జ్ఞానాబాయిచే చరణీ - శరణ్ ఎకా జనార్ధనీ

భావము ॥

సర్వసుఖాల తరంగము జ్ఞానాబాయి అలంకాపురము అంటే జ్ఞానేశ్వర్ మహరాజ్ హరిపాఠము రచించి సమాధి పొందిన స్థలము అళంది అని భావము. అక్కడి పురాతనమైన శివ పీఠమునకు జ్ఞానాబాయి ముకుఠము కావున జ్ఞానాబాయి జనని అని వేద శాస్త్రముల సాక్షము ఇచ్చినవి. జ్ఞానాబాయి చరణములకు ఏక జనార్ధని శరణి అనగా ఏక్‌నాథ్ మహరాజ్ జ్ఞానేశ్వరుని శరణు వేడినారు.

నామసుధ ॥

సర్వసుఖాల తరంగము - జ్ఞానాబాయి అలంకాపురము
శివ పీఠము పురాతనము - జ్ఞానాబాయి అక్కడిముకుఠము
వేదశాస్త్రాల సాక్షము - జ్ఞానాబాయిది మాతృ హృదయము
జ్ఞానాబాయి చరణము - ఏక జనార్ధని శరణము



# లింగాష్టకమ్

బ్రహ్మమురారి సురార్చితలింగం, నిర్మల భాసిత శోభితలింగం ।
జన్మజదు;ఖ వినాశకలింగం, తత్ప్రణమామి సదాశివలింగం ॥

దేవముని ప్రవరార్చితలింగం, కామదహన కరుణాకరలింగం ।
రావణదర్ప వినాశకలింగం, తత్ప్రణమామి సదాశివలింగం ॥

సర్వసుగంధ సులేపితలింగం, బుద్ధివివర్ధన కారణలింగం ।
సిద్ధసురాసుర వందితలింగం, తత్ప్రణమామి సదాశివలింగం ॥

కనకమహామణి భూషితలింగం, ఫణిపతివేష్టిత శోభితలింగం ।
దక్షసుయజ్ఞ వినాశనలింగం, తత్ప్రణమామి సదాశివలింగం ॥

కుంకుమ చందనలేపితలింగం, పంకజహార సుశోభితలింగం ।
సంచితపాప వినాశనలింగం, తత్ప్రణమామి సదాశివలింగం ॥

దేవగణార్చిత సేవితలింగం, భావైర్భక్తిభిరేవ చ లింగం ।
దినకరకోటి ప్రభాకరలింగం, తత్ప్రణమామి సదాశివలింగం ॥

అష్టదళోపరివేష్టితలింగం, సర్వసముద్భవకారణలింగం ।
అష్టదరిద్రవినాశనలింగం, తత్ప్రణమామి సదాశివలింగం ॥

సురగురు సురవర పూజితలింగం, సురవనపుష్ప సదార్చితలింగం ।
పరమపదం పరమాత్మకలింగం, తత్ప్రణమామి సదాశివలింగం ॥

లింగాష్టకమిదం పుణ్యం, య; పఠేత్ శివసన్నిధౌ ।
శివలోకమవాప్నోతి, శివేన సహ మోధతే ॥

# పాండురంగాష్టకం

మహాయోగపీఠే తటే భీమరథ్యా – వరం పుండరీకాయ దాతుం మునీంద్రైః ।
సమాగత్య తిష్ఠంతమానందకందం – పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥౧॥

తటిద్వాససం నీలమేఘావభాసం – రమామందిరం సుందరం చిత్ప్రకాశమ్ ।
వరం త్విష్టకాయాం సమన్యస్తపాదం – పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥౨॥

ప్రమాణం భవాబ్ధేరిదం మామకానం – నితంబః కరాభ్యాం ధృతో యేన తస్మాత్ ।
విధాతుర్వసత్యై ధృతో నాభికోశః – పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥౩॥

స్ఫురత్కౌస్తుభాలంకృతం కంఠదేశే – శ్రియా జుష్టకేయూరకం శ్రీనివాసమ్ ।
శివం శాంతమీడ్యం వరం లోకపాలం – పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥౪॥

చరచ్చంద్రబింబాననం చారుహాసం – లసత్కుండలాక్రాంతగండస్థలాంతమ్ ।
జపారాగబింబాధరం కంజనేత్రం – పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥౫॥

కిరీటోజ్జ్వలత్సర్వదిక్ప్రాంతభాగం – సురైరర్చితం దివ్యరత్నైరనర్ఘైః ।
త్రిభంగాకృతిం బర్హమాల్యావతంసం – పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥౬॥

విభుం వేణునాదం చరంతం దురంతం – స్వయం లీలయా గోపవేషం దధానమ్ ।
గవాం బృందకానందదం చారుహాసం – పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥౭॥

అజం రుక్మిణీ ప్రాణసంజీవనం తం – పరం ధామ కైవల్యమేకం తురీయమ్ ।
ప్రసన్నంప్రపన్నార్తిహం దేవదేవం – పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్ ॥౮॥

స్తవం పాండురంగస్య వై పుణ్యదం యే – పఠంత్యేకచిత్తేన భక్త్యా చ నిత్యమ్ ।
భవాంభోనిధిం వితీర్త్వాంతకాలే – హరేరాలయం శాశ్వతం ప్రాప్నువంతి ॥